

# సక్కుబాయి చరిత్రము.







1932.

ప్రథమ ముద్రణము 1000 ప్రతులు మాత్రమే.

మినర్వా ముద్రాక్షరశాల,

మచిలీపట్నము.

ప్రతి ఒకటికి నాలుగణాలు.



ఈ కృతి

శ్రీ సీతా లక్ష్మణ భరత శత్రుఘ్న మారుతీ సమేతుండగు

శ్రీ రామచంద్రప్రభువున కొసంగబడినది.



# తొలి పలుకు



ఈశ్వరభక్తుల చరిత్రలు వ్యాసములుగ రచించి, భక్త విజయము, గురుభక్త విజయము మొదలగు నామములతో పెద్దలు ప్రకటించియే యుండిరి. ఇంకను పెక్కురు ప్రకటింప ప్రయత్నించుచుండిరి. అట్లు ప్రకటింపబడిన గ్రంథములు కొన్ని వందల పుటలుగల్గి, మిక్కిలి రొక్కమునకుగాని లభించుటలేదు. మంచి భాషాజ్ఞానము కలవారికే తప్ప, తదితరుల కుపయోగించుటలేదు. ముఖ్యముగ స్త్రీల కవుసరమగు అతిసులభశైలిని ప్రకటింపబడిన గ్రంథములు లభించుటలేదు. అందు వలన పై తెల్పిన గ్రంథముల నాధారముగ గొని, ప్రతి భక్తుని జీవిత చరిత్రయు విడివిడిగ సులభశైలిని సామాన్యుల కందుబాటులో యుండునట్లు, ఆంధ్రమహా లోకమున కర్పింప కుతూహలము కల్గుటచే, ప్రథమమున నీ సక్కుబాయి చరిత్ర ముద్రించి ప్రకటించితిని. ఇందు వ్యాకరణ దోషములు పెక్కులుండవచ్చును. నిజముగ, ఇట్టి చరిత్రలు గ్రామ్యభాషలో రచియించి ప్రకటించిన యింకనూ బాగుండునను మతములోనివాడ నగుటచే, వ్యాకరణ విషయమిట నసవుసరము. అచిరకాలములో, జయదేవుని చరిత్ర ప్రకటించువాడనని తమ కెరింగించి విరమించువాడను.

గ్రంథకర్త.

## సక్కుబాయి

పరమపావనియు, సకల దురిత సంహారిణియు నగు కృష్ణా నదీతీరంబున తొల్లి కరవరపురంబను పట్టణ మొండు గలదు. అవ్వీటిగల బ్రాహ్మణక్షత్రియ వైశ్య శూద్రులు తమ తమ కార్యములం దప్రమత్తులై, పరోపకార పారీణులని వన్నెకెక్కిరి. ఏతత్పట్టణ పరిసరములగల భూములన్నియు మిక్కిలి సారవంతములై పలువిధ పంటలచే నలరారుచుండెను. ప్రజలు వైభవస్థులై, అన్యోన్యవైరములు లేమి ప్రశాంతముగ కాలము గడుపుచుండిరి. బ్రాహ్మణులు యజ్ఞయాగాది క్రతువులొనర్చి షట్కర్మనిరతులై, బ్రహ్మజ్ఞాన సంపన్నులగుటచే భూసురులను పేరు సార్థకమాయెను. క్షత్రియులు అమితపరాక్రమ శాలురు. వైశ్యులు న్యాయము దప్పక వాణిజ్య మొనర్చెడివారు. శూద్రులు గోబ్రాహ్మణ భక్తిగలిగి రత్నగర్భయగు భూమిని సేద్యపరచి సకల సస్యములం ఫలింపజేయుచుండిరి. ఇట్లు సకలవిషయముల తోడి పట్టణములకు మిన్నయై యొప్పు నప్పురరాజంబున నొక భూసురుండు గలడు.

ఆ బ్రాహ్మణుండు సకల విద్యల నెరింగినవాడే! కాని యతని దుర్గుణముల వలన విద్యగలవాడయ్యు, పరులకు కంటకుడుగా దోచుచుండెను. అప్పారుండు విత్తసముపార్జనకై యెట్టి యన్యాయములకైన నొడిగట్టును. ఎంతటి యనృతమునకైన వెనుదీయడు. ఎట్టి ఘోర కార్యమైనను త్రుటిలో నొనర్ప సంసిద్ధుడు. ఇతరుల భాగ్యభోగ్యములు

చూచి యోర్వజాలని యసహనశీలుడు. పరులను దూషించుటలో దిట్ట. మంచిచెడుగుల తారతమ్య మెరుంగని యవివేకి. నిష్కారణముగ పెద్దలను నిందించు స్వభావము గలవాడు. వేళ కింటికే తెంచిన యతిథికి అన్నమిడకున్న మానె పానీయమైన నొసంగక తిట్టి నెట్టు దుష్టుడు. గయ్యాళిగంప యగు యాతనిభార్యకు దక్క యితరులెవరిని గాంచి ననూ లెక్కచేయని మహాశౌర్యశాలి. భగవంతుడాతని భార్యనైన సుగుణవంతురాలుగ నొసర్పరాదా? ఆమె గయ్యాళితనము వర్ణనాతీతము. తెల్లవారినది మొదలు భర్తను దూషించుట, బిడ్డలను చావమోదుట, పరులకొంపలకేగి గిల్లికజ్జాలకు కాలుదువ్వి, అకారణముగా వారలను నిందించుట, యింటగల పనులన్నియు భర్తచే జేయించుచు తా నితరకొంపల దిరుగాడుట, మొదలగు చెడు గుణములచే కాపురము సేయు నవ్విప్రునిభార్యకు పదిమందియు గజగజలాడ జొచ్చిరి.

ఇట్టి దంపతుల కొక్క కుమారుండు గలడు. అతండు సకలశాస్త్రములు చక్కగా నెరింగినవాడే! కాని, తల్లిదండ్రుల చెడునడువడి వలన యితరులెవరును పిల్లనివ్వ వెనుకాడుటచే యుక్తవయస్సు వచ్చినను బ్రాహ్మణ కుమారునకు వివాహము కాలేదు. తన సమవయస్కులు భార్యలతో సౌఖ్యపడుచుండుట, కొందరు తమ బిడ్డల నల్లారు ముద్దుగా యాడించుట, చూచినపుడెల్ల యతనికి లోలోన

సిగ్గుగనే యుండెడిది. తనకింక వివాహమగుట దుర్లభమని కూడ, కొన్నివేళల తలంచు చుండెడివాడు. పలుసార్లు కృష్ణలో గృంకులిడి, ప్రొద్దుపోయిననూ యింటికి మఱలి రాక, యిసుకతిన్నెలపై యొంటరిగ గూర్చుండి, ఆకసమున గల చుక్కల లెక్కించువానివలె యేకాగ్రతతో నిట్టూర్పుల నడుమ నిదిరించువాడు. వేళకన్నము దినకయు, సర్వదా తన వక్రరేఖను తలంచుకొనియు, క్రమేణ మిత్రులను వీడి యొంటరిగ మతిభ్రమణ మొందినవానివలె నదీ తీరంబుల సంచరించుచూ, చిక్కిన యక్కుమారుని మార్పుదలకు కారణ మూహించి యా వృద్ధబ్రాహ్మణుడు కుమారునిజేరి "నాయనా! ఏలనీవిట్లుంటివి? నీ కెయ్యది కొదువ?" యని ప్రశ్నింప నాతడు "తండ్రీ! పుత్రుని వ్యాకులత దీర్ప జనకులగు మీరు యెరుంగనిది గలదే! అయిననూ మదీయశ్రేయోభిలాషులగు మాతాపితరులకు, మనోగత విశేషము లెరింగింపకుండుట పాడికాదు. తండ్రీ! నా యీ వ్యాకులతకు హేతువు ద్వితీయాశ్రమము నందుండదగిన నేనింకనూ ప్రథమాశ్రమము వీడ కుండుటయే" యని విన్నవించెను.

అంత నా వృద్ధ బ్రాహ్మణుడు కుమారున కవశ్యము పరిణయ మొనర్ప బద్ధకంకణుడై భార్యతో యోచించి శుభదినంబున వధువు నన్వేషింప బయలువెడలెను. అట్లాతడు పలు పల్లెలందిరిగి, తుదకు పండరిపుర సమీపమున

నున్న యొక గ్రామము చేరెను. ఎండ వేడిమివలననూ, కార్యభారమువలననూ, వృద్ధాప్యము వలననూ, పాపమా విప్రుడు బహు బడలి కడుపులో చిచ్చువెట్టినట్లాకలి ధహింప యా గ్రామంబున పెట్టెడన్నము బెట్టు పుణ్యాత్ములెవరా యని యోచించుచు, "వేళతప్పి యింటికి వచ్చిన అతిథులను గెంటిన నాబోటివానికి యీశ్వరుడు బుద్ధి నేర్పుచుండెన"ని విచారించుచు, నిస్పృహజెంది, యా గ్రామమునకుత్తర దిశయందున్న యొక పేద బ్రాహ్మణ గృహము ముంగిట కూల బడెను.

ఆ గృహ యజమాని నిరుపేద. సత్యమునకు జీవించు సంసారమేగాని యితర వసతులులేవు. అయిననూ తనకున్న యంతలో, కొంత దానధర్మములు, పూజాపునస్కారములు మొదలగు మంచికార్యములకై వినియోగించు సజ్జనుడు. ఇంటికి కేతెంచిన అతిధికి తానోపినంతలో మర్యాదజేయు ధర్మనిరతుడు. ఆయన భార్యయు భర్తయే దైవముగా పూజించుచు, భర్త యాజ్ఞానువర్తియై, మెలగు సుగుణశీల. శ్లో॥ "కార్యేషుదాసీ, కరణేషుమంత్రి" యని పెద్దలు చెప్పినట్లు కార్యసమయముల గనిపెట్టి, వానిని నిర్వహించుటలో భర్తకు దాసియై, అవుసరమగు సమయంబుల భర్తకు కార్యా కార్యవివేచనలందు సలహానిచ్చు మంత్రియై యొప్పు నాయిల్లాలు పతివ్రతగదా!

ఈ సంపతులకు లేకలేక యొక యాడుబిడ్డ కల్గెను. అబ్బాల దినదిన ప్రవర్ధమానయై, తలిదండ్రుల గారాబు

పట్టియై వారలముద్దుముచ్చటలదీర్చుచు చిన్నతనమునుండియు సద్గుణగనియై, శాంతమూర్తియై, భక్తురాలై, భూతదయా పరురాలై, తోడిస్నేహితురాండ్రకు మణియై, యలరారు చుండెను. ఆబిడ్డపేరు సక్కుబాయి. ఒక దినంబున సక్కుబాయి సుగుణములకు మెచ్చి యొక యాచార్యుండామెకు శ్రీకృష్ణ మంత్రోపదేశ మొనర్చెను. అదిమొదలు సక్కుబాయి సర్వదా శ్రీపాండురంగనియందమిత భక్తిగలదై, యా మంత్రరాజమును మరువక పఠించుచూ, యానందించుచుండెను. నిత్యానందమున దేలి యాడు నాగృహాము నకు వేళతప్పి వచ్చిన యా వృద్ధబ్రాహ్మణుని లోనికి గొంపోయి, సేదదీర్చి, తృప్తిగ భోజనమిడి తాము డస్సి యున్నవారు, కొంచముసేపు నిదిరించుడని, యా యింటి యజమాని, కూతురగు సక్కుబాయిని జీరి, "అమ్మా! వీరు పెద్దలు. పూజింపదగినవారు, వీరు నిదురించువరకు పాదము లొత్తి ధన్యురాలవు కమ్మ,, అనిచెప్పెను. సక్కుబాయి యానందముతో యట్లె యొనర్చెను.

నాటి సాయంకాలమున నా గృహయజమాని మన బ్రాహ్మణునితో మాట్లాడుచు ప్రసంగవశమున "స్వామీ తమ దేగ్రామము. ఏకార్యమునకై యిచట కేతెంచితిర,,ని సవినయముగ ప్రశ్నించెను. అందులకు, "అయ్యా, మాది కరవరపురము. సకలశాస్త్రముల నెరింగిన నా కుమారు నకు యీ సంవత్సరము వివాహమొనర్ప సంకల్పించితిని.

అతని కన్నిటం తగిన కన్నియ నన్వేషించుచు నదృష్టవశ మున నిచటకు వచ్చితిని. సకలసద్గుణ సమన్వితయు, రూప వతియు, అగు మీా సక్కు_బాయిని చూచినప్పటినుండియు యీాబిడ్డ నా కుమారునకు, తగియున్నదని నిశ్చయించుకొం టిని. కావున తాము నాతో యేకీభవించి, యీా శుభకా ర్యము నెరవేర్చవలెనని ప్రార్థించుచున్నవాడన,,ని చెప్పి మిన్నకుండెను.

అంత నాగృహయజమాని " స్వామీా, యీాశ్వరుండె చ్చోటనిర్ణయించెనో తెలియదు గదా! దైవలిఖితమట్లేయున్న మాకును సంతసమేన,,ని భార్యతో యేకాంతమున "మన బిడ్డయు యీాడువచ్చిన స్థితిలోయున్నది. ఆలస్యముచేయు టయు మంచిదికాదు. ఇంటికివచ్చిన సంబంధము త్రోసి పుచ్చుట భావ్యముకాదు. ఇందులగురించి నీయభిప్రాయ మేమ" ని యడుగ నాయిల్లాలు భర్తతో నేకీభవించుట యు, పిదప నాతండా బ్రాహ్మణునితో ,,అయ్యా, మా సక్కు_ బాయిని తమ కుమారున కిచ్చి పరిణయమొనర్ప నిశ్చయిం చు కొంటిమి. అందులకు సుముహూర్తము నిశ్చయింప పురోహితున కిదేవర్తమాన మంపుచుంటిన" ని చెప్పి పొరో హితుని బిలిపించి సుముహూర్తము నిశ్చయించి వియ్యంకు నకు లగ్నపత్రిక నిచ్చెను.

నాటి రాత్రియంతయు, భోజనములకడను, భోజనా నంతరమును, వియ్యంకులిద్దరు తక్కు_ంగల్గు లాంఛనముల

విషయమై సంప్రదించుకొని నిదురించిరి. తెల్లవారు ఝాము మునసే మన వృద్ధబ్రాహ్మణుండు వియ్యంకుని కడ శలవు గైకొని కరవరపురంబునకు మఱలివచ్చి భార్యతో జరిగిన యావద్వృత్తాంతము నెరింగింప, నాపెయు మంచికోడలు లభించినందులకు ముదమొంది పెండ్లిపనులు వెన్వెంటనే ప్రారంభించెను.

సుముహూర్తము దగ్గరకువచ్చుటయు, వివాహమైదు దినంబులు యథావిధిగ నెరవేరుటయు, మన సక్కుబాయి కొలదిమాసములకే పుష్పవతియగుటచే, పునస్సంధాన కార్యముకూడ నెరవేర్చిరి. కొలది దినంబులకు సక్కుబాయిభర్త, భార్యను తీసుకువెళ్లునిమిత్తమై యత్తవారింటికే తెంచెను. మంచి దినంబున సక్కుబాయి తండ్రి అల్లునకు, కూతునకు నూతనవస్త్రములు కట్టబెట్టి, మఱునాడుదయమున కూతునత్తవారింటికంప నిశ్చయించెను. సక్కుబాయి తల్లి స్నేహితురాండ్రు, యిరుగుపొరుగువారలు సక్కుబాయినెట్లు వీడియుందుమా యని విచారసాగరమున మునింగిరి. ; ఆడుబిడ్డ అత్తవారింటికేగకుండునాయని కొందరును, సక్కు అందరి పిల్లలవంటిది కాదమ్మాయని కొందరును, సంసార లంపటములో బడినపిదప సక్కుబాయి దైవభక్తి వెనుకబట్టునని మఱి కొందరునూ, కలిగినయింటి యొంటికోడలు దానికేమమ్మా యని మఱికొందరును, ఎవరికి తోచినట్లు వారుపరిపరివిధముల యనుకొన జొచ్చిరి. సక్కుబాయి తల్లి, బిడ్డను కౌగలించు

కొని "అమ్మా! నీవులేని యీ కుగ్రామము చంద్రుడులేని రాత్రి. మాంగల్యములేని స్త్రీ. నీవు సంచరించనిచో యీ గృహము కాంతి హీనమగును. నీముద్దుమాటలు వినకయు, నీభక్తిగీతము లాలింపకయు, వృద్ధులమగు మాకెట్లు ప్రొద్దు వోవును, తల్లీ" యని కన్నీరు కాల్వలుగా చింతించదొడగెను. సక్కుబాయితండ్రి, పొరలివచ్చు దుఃఖము నాపుకొని కూతును దగ్గరకు దీసుకొని "అమ్మా నే జెప్పు నాల్గు ముక్కలు మరువక పుట్టినింటికి, మెట్టినింటికి, గౌరవము సంపాదించుము. భర్తయే దైవముగ మనోవాక్కాయకర్మల నెప్పుడు నమ్ముచు, యాతనియాజ్ఞ యెట్టిదైనను అవశ్యము నెరవేర్చుచు, ఆతనికెదురుచెప్పక నడచుకొనుము. నిదురనుండి మేల్కాంచి, భర్తపాదములకు నమస్కరించి కన్నులకద్దుకొని, యితరకార్యములకు గడంగుము. అత్తమామలు తల్లిదండ్రులుగా చిత్తమందుంచుకొని వారికి సంతోషము కల్గు నటుల సంచరించుచుండ వలెను. బావల కెదురుగ నిలువంబడి సంభాషించుట తగదు. ఇరుగుపొరుగువారిండ్ల కనవసరముగ నేగి, చాలకాలము వారివారితావుల సంభాషించుట తగదు. ఇంటిగుట్టు యితరుల కెరింగించుట పనికిమాలిన పని. ఏకారణము చేతనైన భర్తగాని, అత్తమామలుగాని కోపించిన ఓపికవహించి మిన్నకుండుట ధర్మముగాని, రచ్చకెక్కుట రమణికి గౌరవ నాశనము. సంసారమునకు గౌరవమొచ్చిననూ, అగౌరవమొచ్చిననూ, స్త్రీయే ప్రథమ కారకురాలు. భర్త కురూపి యగుగాక, కోపి యగుగాక,

జారుడగుగాక, చోరుడగుగాక, భర్తయే లోకము, భర్తృపూజయే స్త్రీకి ప్రధానము. తన కున్నంతలో తృప్తిపడి, సద్గుణవంతురాలై కాపురము చేయుటయే పతివ్రతా ధర్మము. కావున నా ముద్దులపట్టీ! నా యీ పల్కులు మరువక, మమ్ము మరువక, చక్కగ కీర్తి గడించుమ''ని గద్గద స్వరముతో పల్కు తండ్రి వాక్యములు వేదవాక్యములుగ సక్కుబాయి గ్రహించు కొనెను.

అంత నా పతివ్రతా తిలకము జననీ జనకుల పాదములకు ప్రణమిల్లి, స్నేహితు రాండ్రను కౌగలించుకొని, పెద్దలకు నమస్కరించి, శ్రీ పాండురంగ విఠల్ భగవానుని దలంచుకొని, భర్తతో పయనమై అత్తవారింటి కేగెను.

సక్కుబాయి, తండ్రి వాక్యములు మరువక, చక్కగ కాపురము చేయుచుండెను. భార్యాభర్త లన్యోన్య ప్రేమతో మెలంగుచుండిరి. వారి కాపురము చూచినవారెల్ల సక్కుబాయి మిక్కిలి గుణవంతురాలని చెప్పదొడగిరి. సక్కుబాయి చిన్నతనమున యుపదేశము పొందిన శ్రీకృష్ణ మంత్రము సర్వదా జపించుచు లోలోన విష్ణురూపమును ధ్యానించుచూ, మధ్యమధ్య విఠల సంకీర్తనానందమున నవ్వుచూ, భక్తిపారవశ్యమున నుండుట అత్తమామలు కాంచి, చిన్నతనంబుననే యిట్లుండిన భర్తతో సంసారము చేయుటయు, బిడ్డలంగనుటయు, తనూ్మలమున వంశాభి

వృద్ధియు గల్గుట దుర్లభమని యెంచి, సక్కుబాయిని యిం
చుక మందలించిరి.

భర్త, సక్కుబాయితో, ఏకాంతమున "ప్రేయసీ! గృహస్థాశ్రమమున నుండి సంసార సాగరమీదుచు, యీశ్వర సేవయొనర్చుటకు నేనునూ సుముఖుడనే. అయ్యాదియు యింత చిన్నతనమున, పనికిరాదని నాయభిప్రాయము. అందుకు కూడ హద్దుపద్దులుండవలయును. అదియును గాక మా తల్లిదండ్రులు కూడదన్నపని విరమింప కుండుట మంచిదికాదు. వారల యాజ్ఞప్రకారము ప్రస్తుతము నీవు విష్ణుభక్తినుండి నీమనస్సు మరలించుకొనక తప్పదు. వృథాగా వారలకేగాక, నాకును కోపము తెప్పించకుము. నీవికమీద నేచెప్పిన ప్రకారము నడచుకొనెదవ" ని నమ్ము చున్నానని హితోపదేశ మొనర్చెను. భర్త పల్కులు ముల్కులు వలెదోప, సక్కుబాయి శిరమువంచి, నిరుత్తరయై, శ్రీవిఠల్, శ్రీవిఠల్, శ్రీవిఠల్, యని ముమ్మారు తలంచుకొని, మిన్నకుండెను.

ఎవరెన్ని విధముల వారించిననూ, భర్తకోపించిననూ, మామ తగదన్ననూ, సక్కుబాయి శ్రీకృష్ణ పరమాత్మను మరువజాలదాయెను. ఆ రాధామాధవుని స్మరించని జన్మ వృథాయని నిశ్చయించుకొనెను. శ్రీరుక్మిణీ వల్లభుని పాద పద్మములు మనమున సర్వదా భజించుచు, గోపీలోలుని

బాలక్రీడలు జ్ఞప్తికిదెచ్చుకొని, గోపాలునిమందలో ఒక పశువై తాను జన్మించియుండిన జన్మరాహిత్య మయ్యెడి గదా యని చింతించుచూ, చేతులుమోడ్చి నమస్కరించుచూ శ్రీవిఠల్ నామములు గానము చేయుచుండెడిది.

సక్కుబాయి, అత్తమామలు చెప్పినప్రకారము శ్రీ విష్ణుభక్తినుండి తనమనస్సు మరలింపకుండుటయు, సర్వదా శ్రీ హరినామ స్మరణయే పనిగా యుండుటయు, గాంచి వారలు కుపితులై, యొకనాటి యుదయమున, పరమ శాంతస్వభావయు, పతివ్రతా తిలకముసగు సక్కుబాయిని పోటుమాటల ధిక్కరించుచూ, "ఓసీ! మూర్ఖురాలా, నీకిదితగదని యెంతవారించిననూ వినక, అత్తమామలమైన మామందలింపులు పాటిసేయక, నీవే స్వతంత్రురాలవై, నీయిచ్ఛవచ్చినట్లు నటించుచుంటివి. ఇయ్యది నీచేటుకు కారణమగునని యెరుంగుము. యుక్తాయుక్తము లెరుంగని బుద్ధిహీనురాలా! అహంకారివై, మాదగు మాటలనేల సరకు సేయవైతివి? చిన్నదానవనియు, అప్రజ్ఞురాలవనియు, అనుభవశూన్యురాల వనియు, యెంచి మంచిగా చెప్పిన మాబోధలు నీతల కెక్కకున్నవే? నీవీమార్గము మానవేని, నిన్నేమి చేయుదుమో చూడుమ" నిరి.

సక్కుబాయి అత్తమామల కఠోర వాక్కులకు కన్నులిచ్చి "హా వైకుంఠవాసా, హా రుక్మిణీవల్లభా, హా కంసాంతకా, హా యశోదాతనయా, నీకిదే పదివేల వందనముల" ని

మనంబున తలంచుచూ, అత్తమామల ధిక్కారింపులకు చింతించుచూ, మిన్నకుండెను.

సక్కుబాయి నిత్యమును పొరుగింటి కోడలగు శాంతతో కృష్ణానదికిబోయి, స్నానమొనర్చి, కృష్ణవేణీ పావనోదకములు దెచ్చుచుండెడిది. యథా ప్రకారమిరువురును, నదికేగుచుండ మార్గమధ్యమున "సక్కుబాయీ! నీవెప్పుడూ దైవభక్తిగల దానివై యిహసౌఖ్యములు కోరక, యిట్లుండుట చేతనేగదా, మీయత్తమామలు నిన్ను నిష్ఠురోక్తు లాడుచుండిరి. పైగా నీభర్తయు తల్లిదండ్రుల కెదురాడు వాడు కాడు. ఆయనయు నీవిట్లుండుటకు సమ్మతించడని నాయభిప్రాయము. అట్టిచో, పెద్దల పల్కులు చొప్పున నీవు నడచుకొనుట యుక్తముగాని, వారి కయిష్టమగు కార్యము సేయుట కోడండ్రనగు మనకు స్వతంత్రములేదు. అయిననూ యింత చిన్నతనమున నీకీవిష్ణుభక్తి యెట్లబ్బెనో నాకర్థము కాకున్నది. ఏదో సంసారయాత్ర వెళ్ళబుచ్చుచూ, పుత్రులు, పుత్రికలుం గని వారలకుపనయన వివాహాది కార్యములు నెరవేర్చుచు, వారలు పెద్దవారలై మనకనుల యెదుట ప్రజ్ఞావంతులై వృద్ధులగు మనల పోషించుకాలమున కృష్ణా! రామా! యనవలసినదేకాని, యిప్పుడా, యిట్టిపద్ధతులు? నీవు మంచిదానవనియు, విద్యగలదానవనియు, శాంత పరురాల వనియు, మేమందరము చెప్పుకొనుటయే గాక, నీ యత్తమామలు కూడ అనుచుండెడివారలు. అట్టి మంచి

యభిప్రాయము వారలకిప్పుడు లేకుండుటకు కారణము నీవు వారలపల్కులు లెక్కసేయకుండుటయే యనితలంచెదను. కావున నీక్షేమము కోరి చెప్పుచున్న నా యీ వాక్యములు విని, యింకనైననూ నీమనస్సు మార్చుకొనుము. సక్కూ! యేమి మాట్లాడవు, జవాబు చెప్పవా? చెప్పననియైన యనుము. ఇదిగో, నదికడకు వచ్చితిమి. నీ నిశ్చయాభిప్రాయము నాతో చెప్పకున్న నామీదయొట్టు" అని శాంత సక్కుబాయి చేయిపట్టుకొని దారిలో నిలువబెట్టెను. దారి పొడుగుననూ శాంత యిట్లుబోధించుట సక్కుబాయికి విచారకారణమాయెను. అందువలన సక్కుబాయి "శాంతా! నాక్షేమము కోరినదాన వగుట చేతనే యింతగా బోధించితివని యెరుంగుదును. నీవు చెప్పినట్లు నా అత్తమామలకు నాపై సదభిప్రాయము లేకుండుట నాదురదృష్టము. వారలుగాని, నా భర్తగాని, యెంత దూషించిననూ, ధిక్కరించిననూ, నాకు లేశమేనియు ద్వేషములేదు. నాకు వారలు దైవతుల్యులు. నేనెన్నడును వారల కెదురాడను. అయ్యది మహాపాతకము. వారు నన్ను దండించిననూ, శాంతముతో సంతోషముతో భరించవలసినదే!

కాని, శాంతా! మీరెంత వలదన్నను శ్రీరుక్మిణీ వల్లభుని మఱువజాలను. ఆ లోకరక్షకుని నిమేషము స్మరించనిచో యీ జన్మ వృథాయని నా యభిప్రాయము. ఈ దేహ మాపాదమస్తకము విష్ణార్పితము. చూడుము, ఈ

శిరము శ్రీ మహావిష్ణునకు మ్రొక్కుటకును, యీ చెవులు శేషశాయి మహిమను చాటు కథలను వినుటకును, యీ కన్నులు రుక్మిణీ వల్లభుని గాంచుటకును, యీ చేతులు కమలనాభుని యర్చించుటకును, యీ జిహ్వ శ్రీనాధుని వర్ణించుటకును, యీ పాదములు విష్ణుప్రదక్షిణము సేయుటకునూ యీ మది శ్రీహరిని చింతించుటకునూ, అమరియున్నవని చెప్పుదురు. మరియు విష్ణుభక్తిలేని వ్యక్తి ద్విపాదపశువుగదా! ఈ మహా సంసారసాగర మీదుటకు విష్ణునామోచ్ఛారణయే తరింపజేయు తెప్ప. ఈ సంసార తాపత్రయాగ్నిని చల్లార్చునది శ్రీహరి సేవావృష్టి. కమలనాభుని నుతియే సర్వపాప మహాటవిని గాల్చు బడబాగ్ని. జరామరణములులేక తరింపజేయునదియే దేవదేవుని దాస్యము. మఱియు జన్మలలోకెల్ల యుత్తమోత్తమ మైనదీ మానవజన్మ. నియమిత కాలంబగు శతవర్షములలో సగము నిదురక్రింద తీరిపోవుచున్నది. మిగిలిన సగములో, బాల్యావస్థలో కొంతను, వివాహాది కార్యానంతరము భార్యాపుత్రాదులతో సౌఖ్యంబుండుటకు కొంతను, విత్త సముపార్జనా ప్రయత్నంబుకు కొంతను, యిహలోక వాంఛితార్ధంబులగు గృహ, క్షేత్ర, ఆరామాదుల నమర్చుకొనుటకు కొంతను, వృద్ధదశలో జరాపీడితులమై కొంతకాలమును గడపి మరణించుచుంటిమేగాని, యిది యంతయు యశాశ్వతమనియు, యివి యెవ్వియు వెంట రావనియు, మూడు నాళ్ళముచ్చటను నమ్మి, శాశ్వతమగు కైవల్యప్రాప్తికై ప్రయత్నించుట లేదుగదా! అజ్ఞానులమై

శ్రీహరిని మరచి పుత్రమిత్రి కళత్రాదులే శాశ్వతమనుకొని ఋణాను బంధము వీడిపోవ మరణించి మఱల యే క్రిమికీట కాది తిర్యగ్జంతువు గర్భంబున నుద్భవించవలెనో, యెన్ని యోనులంబుట్టుచు చచ్చుచు, పూర్వజన్మల నెన్నెన్ని సుకృతంబు లాచరించుటచే, నీమానవజన్మ మెత్తితిమో, మఱల నిట్టి యుత్కృష్టజన్మ మనకు లభించునో లేదో, చెప్పుట దుర్లభముగదా! ఇప్పుడే శ్రీహరిని భజించి, చింతించి, ప్రార్థించి, అర్చించి, సేవించి, స్తుతించి, తరించవలెను. శాంతా! యిప్పటికి నానిశ్చయము నీకు తెలిసి యుండును. చాలా ప్రొద్దెక్కినది. కృష్ణవేణీ సలిలంబుల స్నానంబొనర్చి చిత్తశుద్ధులమై, త్రుటికాలము శ్రీహరిని గానము సేయుదమా!" యని సక్కుబాయి వచింప, శాంత యామెకు నమస్కరించి, "అమ్మా నాకొరకై, యింతదయతో, శాంతముతో, శ్రీహరినిగురించి బోధించినందులకు వందనములు. నీవు ధన్యురాలవు నీ బోధవలన నేనును యికముందు రాధామాధవుని సేవించెదను. నీవనినట్లే మనకభిమాన కీర్తనంబగు "పండరినాథ విఠలా" గానముచేయుద" మనెను.

అంత శాంతా సక్కుబాయిలు కృష్ణానదీ పావనోదకముల గ్రుంకులిడి, నిర్మలచిత్తులై, కరములు మోడ్చి, యా శ్రీహరి నీ విధముగ గానము చేసిరి.

(ఆనందభైరవి—ఆది)

(మోహనమురళీలోల మాదిరి)

పండరినాథ! విఠలా! శ్రీవిఠలా! శ్రీవిఠలా!
భక్తులబ్రోవర విఠలా ॥శ్రీపండరి॥
జనన మరణములు లేనివాడవై । జగములనెల్లను బ్రోచు
వాడవై । జనకంటకముల మాపి । దయజూపి । దయజూపి ।
చయ్యన దురితముబాపి ॥శ్రీపండరి॥
నిరాకార నిర్వికార కేశవ । నీరజాక్ష హరి రాధామాధవ ।
నిరతము వేడగలేదా । యిదివాదా । యిదివాదా । నిర్మల
నీదయ రాదా ॥శ్రీపండరి॥
నందనంద గోవింద ముకుంద । వందనమిదె యా శ్రితజన
బృంద । సుందర మురళీధర । శ్రీధర । శ్రీధర । మందర
గిరి ధర ॥శ్రీపండరి॥

గానానంతరము, కృష్ణానదికి నమస్కరించి, పావనోదకములు గొని, యిరువురును తమగృహముల జేరిరి.

సక్కుబాయి యెప్పటివలెనే శ్రీహరిని ధ్యానించుట, సాధుజనులను పూజించుట, మాన నందున ఆమె భర్తకు రోషమధికమై, సక్కుబాయిని పిలచి "నీమూర్ఖత నీచేటుకు కారణము. ఎందునులేని మహాభక్తి నీకే అబ్బెను కాబోలును. తాచెడ్డ కోతి వనమెల్ల జెరచినట్లు, నీ పిచ్చి యితర యిండ్ల కోడండ్రకు కూడ బోధపరచుచుంటివి గా! ఎంతటి పరమ భక్తురాల వైతివి? మాతండ్రి నిన్నేసన్యాసి

మఠములోనో చేర్చక పెండ్లి యేలచేసెను? బ్రహ్మచారి ణివై, భర్తయొక్కయు, అత్తమామల యొక్కయు, అదు పాజ్ఞలులేక, నీయిచ్చవచ్చినట్లు సంచరించుటకు వీలుగ నుండెడిదే! అనవుసరముగ ఈ గృహచ్ఛిద్రము మాకేల? నీ మూలమున, మా సంసారము వీధికెక్కుటయు, మా గౌర వము నాశనమగుటయు,మామాట సాటివారిలో పాటిలేకుండు టయు, మా మిత్రులు శత్రులగుటయు, సంభవించుచున్నది. ఇంక యూరకుండనని యెరుంగుము. నీపట్టుదల వీడకున్న నీపాటు తలంచుకొనుము" అని బెదరించెను.

సక్కుబాయి తన దురదృష్టమునకు యెంతయు పొగిలి, శ్రీపాండురంగని మహిమ వలన తన అత్తమామలు, భర్త తనయెడ ప్రసన్నులు కాకుందురా యని చింతించ దొడగెను. పరమ పతివ్రతా తిలకమగు సక్కుబాయిని అత్తమామలు, భర్త నిరంతరము బాధించుచుండుట, క్రమేణ కరవరపురమున అనేకమందికి తెలిసెను. వారలలో పెద్దలు సక్కుబాయి గృహమున కేతెంచి, ఆమె మామగారితో "అయ్యా! తాము సకలశాస్త్రము లెరింగిన పండితులు. తెలియని మాబోటి వార లేదైన తప్పుచేసిన, తగదని మంద లించవలసినవారు. అట్టిమీరు సద్గుణశీలయగు మీకోడలు భక్తికి మెచ్చుకొని, సంతోషించుటకు బదులు, దండించుట యేటి న్యాయమో తమరే యించుక యోచించుడు. మేము మీకు చెప్పతగినవారమా! ఇట్టి యోగ్యురాలగు కోడలు

లభించిన మీయదృష్టము, మీరేల గ్రహింపలేకుండిరో ఆశ్చర్యముగానే యున్నది. నిర్దోషురాలును, పరమశాంతు రాలును, అగు ఆమెను హింసించుట మీకు మంచిదికాదు. ఆమె దుఃఖించిన మీకు క్షేమముకాదు" అని చెప్పి వెడలి పోయిరి.

అగ్నికితోడు ఆజ్యము బోసినట్లు, అసలే మండుచున్న వృద్ధబ్రాహ్మణుడు, పొరుగువారల మందలింపుల వలన కోప మధికమై సక్కుబాయి వలనగదా తన కొంపకింత, యల్లరి వచ్చినదని తలంచి, వంటయింటనున్న యీమెను "ఛీ! సిగ్గుమాలినదానా! తగుదునని యితరయిండ్లకు కూడవెడలి మొఱబెట్టు కొనుచుంటివా? మా యింటి గుట్టు యితరుల కెరింగించి వారలను మాపైకి యుద్ధమునకు పురిగొల్పి, యేమి యు నెఱుంగని నంగనాచివలె, వంట యింట కులుకుచుం టివా? దుర్మార్గురాలా! ఈ గ్రామములో నింతమంది నెట్లు వశపరచుకుంటివే? ఎంత యాలోచనచేసితివి? ఇందుకు నిన్నన వలసిన పనియేమున్నది? మా వాడు దురదృష్ట వంతుడు కనుకనే స్నేహితులు భార్యలతో చక్కగ సౌఖ్యపడుచుండ, వానిగతి యిట్లున్నది. ఏనాడు నీపాదము బెట్టితివో, నేటి వరకు ఒక్కదినమైన శాంతముగ గడువలేదు. ఎల్లప్పుడూ నీయేడ్పుతోనే సరిపోవుచుండె. అట్లు చూచెదవేమి? ఇంత మొండిని యెచ్చటను చూచియుండలేదు. ఎవరేమను కొన్ననూ సరే, మారాడనిదే మందుగ నున్నదే! ఇప్పుడే

యింత నిర్లక్ష్యమైన ముందునిన్ను పట్టపగ్గము లుండునా? నేటికి మహాభక్తురాలవు బయలుదేరితివి. నీభక్తి వలననే లోకము నిలువ గలుగు చున్నది కాబోలును." అని నోటికి వచ్చినట్లెల్ల పరుషవాక్యము లాడుచుండ, గయ్యాళిగంప యగు యాతని భార్య సమయమున కేతెంచి, "పాపిష్టి దానా! నీవు పోయిన మా కొంప హాయిగనుండునే. దిక్కుమాలిన సంబంధ మెచ్చట దాపరించినదో! ఏనాడులేని దీ యూరి పెద్దలకు మా యింటివిషయమై చర్చలెందుకే" యని నిరుత్తరయై శ్రీనాథుని దలంచుచు, చింతించుచున్న యాసద్గుణ శీలను యా పరమపావనురాలను, సక్కుబాయిని శిరోజములు పట్టి, నేలకీడ్చి, కఠినముగా మోదెను. అత్త గారు తన్నట్లు దండించిననూ, దూషించిననూ, సక్కుబాయి శాంతముతో శ్రీహరిని దలంచుకొని, లోలోన దుఃఖించెనే గాని మారు పల్కదాయెను.

సక్కుబాయి కష్టములెరింగిన శాంత మిక్కిలి విచారించ దొడగెను. ఒకనాడు శాంత, సక్కుబాయి, శారద, సీత, కృష్ణానదికి మంచినీటికై వెడలుచుండిరి, దారిలో సీత "సక్కుబాయీ! నీ విషయము శాంత అనేకసార్లు చెప్పుచుండెడిది. వీలుచిక్కినప్పు డడుగవలెనని తలంచుచుంటిని. తల్లీ! నీకు తల్లిదండ్రులు లేరా? నీకు తోబుట్టువులు లేరా? ఈ దుర్మార్గులకు నీవెట్లుదొరికితివమ్మా! మీ అత్త నోటికి ఈ యూరేభయపడును. మీ మామ దుర్మార్గముల

కంతులేదు. విచారించక మీతండ్రి నిన్నిచ్చియుండును. ఈ బాధలు యెట్లు భరించుచుంటివో గాని, వినిన మాకే కడుపు తఱుగుకొని పోవుచున్నదే! పోనీ మీ పుట్టినింటికి వెళ్లి కొలది దినములు సుఖింపరాదా? అమాయికురాలవు, ఎంత ఖఠినాత్ములైననూ యింత ఘోరమమ్మా!" యన సక్కుబాయి "అమ్మా! నా క్షేమము కోరియే వచించితివి. కాని ఎవండు సకలచరాచర జంతుకోటిని రక్షించి పోషించుచున్నవాడో, యెవ్వని సంకల్ప మాత్రమున నీపదునాల్గు భువనములు క్షణములో నాశనమొందునో, యేమహానుభావుడీ ప్రపంచసృష్టి స్థితి లయ కారణ భూతుండో, యే పరమపావనుండు తన భక్తకోటి కష్టములదీర్చి యభయ మొసంగునో, యే జగద్రక్షకుండు పిపీలికాది బ్రహ్మ పర్యంతము గల జీవకోటికి తండ్రియై, యాధారుడై, దయాసముద్రడని పేర్గాంచెనో, అట్టి యశోదానందనుండు, అట్టి గోపీలోలుడు, అట్టి రుక్మిణీ వల్లభుండు, నన్నుకన్నతండ్రి. సతత మాతని చెంతనుండి సేవించు జగన్మాతయగు రుక్మిణి నాతల్లి. అతనిని నిష్కల్మష భక్తితో జపించి తరించు భక్తులు నా తోబుట్టువులు. మహాక్షేత్రమని పేర్వడసినట్టియు, చంద్రభాగానదీ తోయంబుల పవిత్రమైనట్టియు, దర్శన మాత్రమున సకలపాపముల బోకార్చు మహిమ గలట్టియు, నిత్యానందమున దేలియాడు శ్రీపండరిపురము నాపుట్టినిల్లు. నా అత్తమామలు నన్నుదండించిననూ, హింసించిననూ, నాకు వారలయందు అసూయలేదు. ఎప్పటి

కైనను వారుకూడ శ్రీహరిసేవ యొనర్చెదరని యే నా నమ్మకము" అని యూరకుండెను. సక్కుబాయి వచనముల కందరాశ్చర్య మొందిరి. అంత నందరును కృష్ణానది యందు స్నానమొనర్చి, యథాప్రకారము నీరములుగొని యెవరి యిండ్లకు వారేగిరి.

ఇచ్చట నిట్లుండ, ఘుర్మ వీరానదీ సంగమ ప్రదేశమున, భీమనదీ తీరమున, తీర్థక్షేత్ర దైవతములగు మూడింటిచే నలలారు పండరిపురమున శ్రీపాండురంగ విఠల్ భగవానుని యుత్సవ దివసంబులు సమీపించెను. ఆ మహోత్సవము తిలకించి ధన్యులగుటకు భక్తులు పలుతావులనుండి తండోపతండములుగ బయలుదేరిరి. వేడుకజూచునిమిత్తమై ప్రజలు గుంపులుగుంపులుగ పండరిపురమున చేరుచుండిరి. భజనపరులు తంబుర మృదంగాది వాయిద్యములతో, హరిభజన సేయుచు మార్గమధ్యమున నందందు బసలు చేయుచు, మరల ప్రయాణము సాగించుచు, ఉత్సవము నాటికి పండరిపురముజేర నేగుచుండిరి. ఒక భజనబృందము కృష్ణానదీ తీరమందుగల ఆరామమున బసచేసెను. వారందు విడియుట కరవర పురవానులెరింగి, పాలు, పండ్లు యొసంగి, సంతోష పెట్టిరి. మఱికొందరు వారలతో పండరికి ప్రయాణమై, విఠలోత్సవము తిలకించి రా నిశ్చయించిరి.

భజనపరులు కృష్ణానదిలో స్నానమొనర్చి అనుష్టానాదులను దీర్చుకొని, భగవత్సంకీర్తనము చేయసాగిరి.

సౌరాష్ట్రి — ఏకతాళము

జయతుజయతు విఠలా ! జయతుజయతు విఠలా ॥జ॥
జయతుజయతు శ్రీధవ। జయతుజయతు మాధవ।
జయతుజయతు రాఘవ। జయతు హృషీకేశవా ॥జ॥
జయతు దీనజనరక్ష। జయతు లోకసంరక్ష।
జయతు పుండరీకాక్ష। జయతు యాగమదీక్ష ॥జ॥
జయతు పండరీపురవాస। జయతు లక్ష్మీహృదయేశ।
జయతు విఠల పరమేశ। జయతు మంగళకర యీశ ॥జ॥

కమాచి — రూపకతాళము

శరణు శ్రీహరీ విఠల। శరణు శ్రీహరీ విఠల ॥శ॥
కరుణ జూపుమా విఠల ॥శ॥
నందనందనా విఠల। నందనందనా విఠల।
నవనీతచోరా।
వందనమిదె సుందర గో। వింద మాధవా। విఠల ॥శ॥
అల ద్రౌపది నిన్ను వేడ నలరింపగలేదా।
విజయసారథీ విఠల। విజయసారథీ విఠల।
విశ్వరక్షకా।
సుజనార్చిత త్రిజగాశ్రిత। భజనజేసెదన్ విఠల ॥శ॥
సర్వభోక్త హర్త కర్త భర్తయు నీవెకాదా।
దానవాంతకా విఠల। దానవాంతకా విఠల।
దశరథ సుతా।
దశకంఠుని పసదూల్చియు। తరుణి నేలవా విఠల ॥శ॥

సక్కుబాయి—

కఠినమైన హృదయమును విడిచిపెట్టవే కడతేర్పగ లేదా।
భక్తవత్సలా విఠల। భక్తవత్సలా విఠల।
: పరమపావనా।
భవతరణా శ్రితపోషణ । త్రిగుణభూషణా విఠల ॥భ॥

ఇట్లు భక్తులు లయతప్పక నృత్యమొనర్చుచు, శ్రీ పండరినాథుని కీర్తించుచు, భజనచేయుచుండిరి. చూడ వచ్చిన కరవరపురజనులు, తమకార్యములను కూడ మరచి యీ భజనపరులను కొనియాడుచు, అందే నిలచియుండిరి. అప్పటికే రెండు ఝాములు సమీపించుటచే, నా భక్త బృందము భజనచాలించి, నాటి సాయంకాలము ముందు మజిలీకి ప్రయాణము చేయ సన్నాహపడుచుండెను.

భజన పరులు కృష్ణానదీ తీరంబున బసచేయుటయు, కరవర పురవాసులు గుంపులు గుంపులుగ చూచి వచ్చుచుండుటయు, సక్కుబాయి వినినదై, విష్ణుభక్తులకు నమస్కరించి, వారల యాశీర్వాదము బొంద కృతనిశ్చయురాలై, నాటి సాయంకాలము శాంతతో కూడ నచ్చోటకేగెను. మహాభక్తురాలగు సక్కుబాయి వారలను గాంచినంతనే అమందానందమున చేతులుమోడ్చి "తండ్రులారా! మీరు ధన్యులు. ఈ సంసార తాపత్రయాదుల చిక్కుకొనక, శ్రీలక్ష్మీలోలుని భక్తులై, యాతని కృపకు పాత్రులైరి. ఇంతటి మహాభాగ్యము సామాన్యులకు లభించదు. భక్తాగ్రే

గణ్యులగు మీ పాదధూళి శిరమునదాల్చిన నా కోటి యజ్ఞానులు తరింపకుందురే ” అని సాష్టాంగ నమస్కార మొనర్చెను. పరమ భక్తురాలగు ఆమెనుగాంచి, 'భజన పరులేగాక, చూడవచ్చిన కరవరపుర జనులు, సక్కుబాయి నిర్మల వాక్యముల కచ్చెరువొంది, యామె నిశ్చలభక్తి కెంతయు కొనియాడిరి. సాయంకాల మగుటచే, చూడ వచ్చిన ప్రజలు యిండ్లకు మరలిరి. సూర్య తాపము తగ్గు టచే భజన పరులు ముందు గ్రామమునకు ప్రయాణమైరి. ఆ వైష్ణవ భక్తులను సక్కుబాయివీడి రా జాలదాయెను. వారలతోడను శ్రీ పండరిపురమున కేగి విఠలోత్సవము తిల కించి రా యుత్సాహముకలెను. ఆమె తన యభిప్రాయమును వెలిబుచ్చ భజనపరులు “ తల్లీ! ఇతరాభ్యంతరము లెవ్వియు లేనిచో, అవస్యము రమ్మ ” అని పల్క సక్కుబాయి పర మానందముతో “ శాంతా! నేను వీరలతో పండరిపురమున కేగి, భగవానుని సేవించి వచ్చెదను. నాయందు దయ యుంచి యీ సమాచారము, మాయింటికడచెప్పుమ ” ని ఆమెను వెనుకకు పంపి, తాను భక్తులతో పండరికి పయన మయ్యెను. శాంత తిరిగివచ్చి, సక్కుబాయి భక్తబృంద ముతో పండరిపురమున కేగుచు, యీ వృత్తాంతము తమ కెరింగించవలసినదిగా కోరినదని సక్కుబాయి యత్తమామ లతో చెప్పెను. ఆ సంగతి వెంటనే సక్కుభర్త విని తోక త్రొక్కిన త్రాచువలె మండిపడి కృష్ణాతీరమునకు వెడలి అచ్చట భగవన్నామ స్మరణచేయుచు, భక్తుల గలసి చను

చున్న, సక్కుబాయిని, జుట్టుబట్టుకొని అతిక్రూరముగ దండించుచు, దూషించుచు, ధిక్కరించుచు, యింటికి తీసుకొని వచ్చుచుండెను. ఈక్రూరత్వముచూచి, భజన పరులు మిక్కిలి చింతించిరి. దారిపోవుచు ప్రజలు సక్కుబాయి కష్టములకు కన్నీరుకార్చిరి. దయాదాక్షిణ్యములు లేక, అబలయే యని శకింపక, నోటికిరాని కారుకూతలు కూయుచు, సక్కుబాయిని చావమోదుచుండుట, ఆమె చెలికత్తెలు చూచి పొరలివచ్చు దుఃఖము నాపుకొనజాల కుండిరి. మార్గమధ్యమున తారసిల్లిన కొందరు "అయ్యా! త్వరపడకుడు. వృథాగా స్త్రీహత్యాదోషము కట్టుకొనకుడ" ని వచించినను, వినక అంత కంతకు రోష మధికమై సక్కుబాయి మూర్ఛిల్లినను లెక్కసేయక, శరీర మాపాదమస్తకము దెబ్బలచే కంది కాయలు గట్టునట్లు కొట్టుచు, యీడ్చుకొనిపోయి, రెక్కలు విరచి నొకస్తంభంబునకు కట్టివేసెను. ఆమె యత్తమామలును, తమ కుమారుని ప్రజ్ఞకు మెచ్చుకొని, సక్కుబాయి కన్నపానీయములైన యివ్వక చచ్చిన యీడ్పించెదములే యని యూరకుండిరి.

సక్కుబాయి తన భర్త దండించినను, దూషించినను, కోపగించుకొనదాయెను. అత్తమామలు అన్నపానాదు లిడకున్నను వారలను ద్వేషించ దాయెను. ఇన్ని శ్రమలు బెట్టినను, శ్రీ విఠలుని మరువ జాలదాయెను. శ్రీ రుక్మిణీ వల్లభుని మహోత్సవము జూచు భాగ్యము

తనకు లభించలేదు గదా యని మిక్కిలి దుఃఖించ దొడగెను. లక్ష్మీలోలుని సేవించజాల నందులకు తన దురదృష్టమును నిందించుకొనెను. ఒకటి రెండు పూటలు గడచిన పిదప సక్కుబాయి శరీర మంతయు చాలా బాధగా యుండెను. దెబ్బలవలన శరీరము నందు గాయము లేర్పడెను. అన్న పానాదులు లేకుండుటచే దేహము శుష్కించి శక్తి దప్పుచుండెను. ఆమె తన్ను రక్షించు దైవము శ్రీయదుపతియే యని నమ్మి యాతని నిట్లు ప్రార్థింపజొచ్చెను. "హా! కృష్ణా, హా! కృపానిధీ, హా! భక్తవత్సల, హా! ప్రహ్లాదరక్షక, హా! పుండరీకాక్ష, హా! రుక్మిణీవల్లభ! నీ కిదే సహస్ర కోటి నమస్కారములు. ఈ దీనురాలిని విచారించవా! ఈ భక్తురాలి మొఱ లాలించవా! ఈ దిక్కులేని దాసను పాలింపవా! సర్వకాల సర్వావస్థలయందు నీ పాదపద్మములే నమ్మి, నీ దాసానుదాసురాల నైన నన్ను రక్షించుట నీకు భారమా! స్వామీ! దయాఘుండవై గోవులను గోపాలురను దావాగ్ని నుండి రక్షించి కాపాడిన నీబోటి మహానుభావు నకు ఒక్క దీనురాలిని బ్రోచుట కష్టమా! ఎంగిలిఫలంబులొ సంగి నందులకే శబరికి మోక్ష మిచ్చితివే! నదిని దాటించి నందులకే గుహుని నుద్ధరించితివే! వారిపాటి చేయకుందు నా? పేదయగు కుచేలునిపై బరపిన నీ భక్తవత్సలత యెచ ట దాగినది? మిత్రుడగు నుద్ధవు నుద్ధరించిన నీ ప్రేమ యెం దుబోయినది? చెరగుమాసిన ద్రోపదికి మానభంగ మగు చుండ వలువలిచ్చి రక్షించిన నీ మహిమ యేమైనది? ఇంద్ర

కల్పిత మహోవృష్టినుండి యాదవుల గాపాడ గోవర్ధనగిరి నెత్తిన నీ పరాక్రమము నెుక్కవోయెనా? స్వామి! త్వరపడుచుంటిని. క్షమించుము. క్షమించుము. పుండరీకుని కోరకై పాండురంగడ వైతివి. భక్తుని ప్రార్థనకై రామభద్రుడ వైతివి. తండ్రీ! కాపాడుము. నీ కొరకై నా యీ హృదయము యెంతో వేదన నొందుచున్నదో! ఎంతో తహ తహలాడుచున్నదో! ఇంక సహింపజాలను. ఈ బాధలు భరించుటకు శక్తి చాలకున్నది. ఈ ప్రాణములు కొలది కాలముకంటె యెక్కువ నిలువవు. ఇది నిశ్చయము. బొందెను జీవముండగనే నిన్ను కడసారి కీర్తించెదను. మహాప్రభూ ఎన్ని జన్మలెత్తినను నీ పాదపద్మములు మరువకుండునట్లు నాకు వరమిమ్ము.

సావేరి — ఏకతాళము.

ఈ క్రూర, బాధ, లెటు, సహింతును। యీశ్వరా, నన్ను
బ్రోవరా ॥ఈ॥
తల్లియు, తండ్రియు, ధనము, నీవని। తలచియున్నదాన
గాన శ్రీహరి। యీశ్వరా, నన్ను బ్రోవరా ॥ఈ॥
దాతన, బాలుని, రక్షించు, టకునై। రహి, నరశింహావ
తారమెత్తిన। యీశ్వరా, నన్ను బ్రోవరా ॥ఈ॥
కర, చర, ణంబులు, గట్టిరి తండ్రీ। కరముమోడ్చి నమ
స్కారము చేయగ। యీశ్వరా, నన్ను బ్రోవరా ॥ఈ॥
దీనత, వేడితి, దీన, దయాపర। ధీర శూర గంభీర దార
పర। మేశ్వరా నన్ను బ్రోవరా ॥ఈ॥

తృణము మొదలుకొని సమస్త బ్రహ్మాండములందు నాకే రూపున నిండియున్న నీకీ దిక్కులేనిదాని యీ క్రందనము వినబటుట లేదా? "అణోరణీయాన్ మహతో మహీయాన్" అని పెద్దలు చెప్పినట్లు అణువునకంటె నణువె యుండెడి నీకీ దీనురాలి పాట్లు గోచరించుట లేదా? హే! పాండురంగా! సర్వ హృదయాంతర్వర్తీ! కరుణామయా! రాధా మాధవా!

శ్లో॥ "గోధూళిధూసరిత కుంతల కోమలాగ్రం
గోవర్ధ నోద్ధరణ కేళి కృతప్రయాసం
గోపీజనస్య కుచకుంకుమ ముద్రితాంగం
గోవింద మిందువదనం శరణం భజామః"

అని శ్రీ వేణుగోపాలుని కీర్తించి, తన్మయత్వముచే శరీర మెరుంగక స్తంభంబునకు జేరగిలబడి నిదురించెను.

శ్రీ పండరిపుర మహోత్సవము యింక రెండు దినంబులే గలదు. భక్తులు తండోప తండంబులుగ భజనలు చేయుచు, నృత్య మొనర్చుచు, బ్రహ్మానందమున ఉత్సవ దర్శనార్థమై యందందు పండరిపురమున బసలచేయుచుండిరి. కొందరు విఠల్ స్వామిని దర్శించి, తమతమ మ్రొక్కుబడులు చెల్లించి, ప్రదక్షిణాదులొనర్చి, ధన్యులగుచుండిరి. శ్రీవిఠల్ దేవస్థాన భక్తబృందము తంబుర మృదంగాది వాయిద్యములతో భజనచేయుచుండిరి. ఇట్లుండ భక్తవత్సలుండగు

పాండురంగడు, సక్కుబాయి కుయ్యాలించినవాడై, రుక్మి బాయితో "కరవరపురమున, సక్కుబాయియను మదీయ పరమభక్తురాలు, నాయుత్సవము తిలకించి నన్నుసేవించ దలంచెను. అందుల కామె యత్తమామలు, భర్త యంగీక రింపక స్తంభంబున కామెను కట్టివేసి, అన్నపానీయములైన యివ్వక హింసించుచున్నవారలు. నాభక్తురాలు యిన్ని కష్టములు కోర్చియు, నన్ను యించుకేనియు మరువక రాత్రిం బవళ్లు ప్రార్థించుచున్నది. నేను వెంటనేయేగి, కట్లువిప్పి యామె పండరికి వచ్చుమార్గ మాలోచించవలెను" అని చెప్ప "నాథా! అవశ్య మాభక్తురాలగు సక్కుబాయిని రక్షించవలసినదే" యని, రుక్మిణీదేవి తన్ను పురిగొల్ప పాండురంగడు అర్ధరాత్రముననే బయలుదేరి కరవరపురంబున కేతెంచెను.

నిదురదెలిసి, సక్కుబాయి "హే పాండురంగా, హే సర్వాంతర్యామి! హే దీనదయాళూ! హే భక్తవత్సలా! హే కృపాజలనిధే! హే మునిజనవందితా! హే పరంధామా! హే పతితపావననామా! హే గజేంద్రరక్షకా! హే ప్రహ్లా దవరదా! హే ద్రౌపదీమాన సంరక్షా! హే రాధామా నసచోరా! హే పితృవాక్య పరిపాలనా! హే దానవాంతకా! హే నీలమేఘశ్యామా! హే ఆశ్రితజన మందారా! హే కరుణామయా! పాహిమాం, పాహిమాం, పాహిమాం" అని ప్రార్థించుట పాండురంగడు వినినవాడై, వెంటనే సక్కు బాయి చెలికత్తెయగు శాంతరూపముతో యామెను సమీ

పించి "సక్కుబాయీ! ఏలయిట్లు మొండి పట్టుదలతో నీ భర్తకు దూరమయ్యెదవు? ఇంకనైన నీ యుద్యమము మాని అత్తమామల కృపకు పాత్రురాలవు కమ్మా" అని వచించు చుండ, మాయా శాంతను సక్కుబాయి కాంచి "అమ్మా శాంతా! నాభర్తకు దూరమగు యుద్దేశ్యము నాకులేదు. నా అత్తమామలు నాకు విరోధులుకారు. నేను సర్వదా వారలదయకు పాత్రురాలనే. వారలుకూడ నావలె విష్ణు భక్తులై శ్రీపండరినాథుని సేవించి తీరెదరని నా విశ్వాసము. ఇంతకు యేది యెట్లున్నను నామనస్సు యా రుక్మిణీవల్లభుని నుండి మరలిరాకున్నది. ఆదేవ దేవుని దివ్యమూర్తి యదుగో, ఆగోపీలోలుని వీణానాద మదిగో, ఆ పరంధాముని భక్తకోటి యదిగో, ఆహా! వారందరూ శ్రీవిష్ణుని కీర్తించుచుండిరి. అదిగో, యెంతయానందముతో నృత్యమొనర్చుచుండిరి! యెంతముచ్చటగా కీర్తించుచుండిరి. ఆహా! వారల నందరినిశ్రీవిఠల్ భగవానుడు తనకడకు బిలుచు చున్నవాడు. అయ్యో! స్వామీ నేనెట్లు నీకడకు రాగలను. ఈ దీనురాలు నీయుత్సవము జూచుటకు నోచుకొనలేదు. శాంతా! శాంతా! నాయందు దయయుంచి నాబంధములు విడదీయుము. శ్రీకరునిదివ్యకర స్పర్శచే నేనుకూడ ధన్యత నొందెదను" అని తత్తరపడు సక్కుబాయి కట్లువిప్పి మాయా శాంత అమ్మా నీవు పండరిపురము వెడలి, స్వామిని సేవించి త్వరగారమ్మా అని పల్క మహానందముతో నామె పండరిపుర శ్రీ విఠల్ మహోత్సవ దర్శనోత్సాహమున

అన్నపానములులేక కడు బడలియున్నను లెక్కసేయక, వెడలి పోయెను.

ఇచ్చట శాంతరూపమున నున్న శ్రీమహావిష్ణు సక్కుబాయి రూపువహించి, ఆమెకు బదులు తానే కట్లలో యుండెను.

సక్కుబాయి పండరిపురముచేరి శ్రీపాండురంగ విఠల్ భగవానుని దర్శించి, నిశ్చలభక్తితో స్వామిని సేవించుచు, విధివిధానముగా పూజించుచు, పరిపరి విధములు స్తుతించుచు, విఠలోత్సవము కన్నులుపండువుగ గాంచుచు, మహానందముతో ప్రొద్దు బుచ్చుచుండెను.

అట కరవరపురమున కొన్ని దినంబులకు సక్కుబాయి భర్త, తన భార్యకు అన్నము పెట్టకయు, పానీయమివ్వకయు బాధించిన కొలది దినములలో మరణించు ననియు, తన్మూలమున తనకును తల్లి దండ్రులకును రాజదండనము ప్రాప్తించుననియు తలంచి, సక్కుబాయి రూపముననున్న శ్రీ మహావిష్ణుతో “ ఇంకనైన నీపట్టు వీడెనా? మేము వలదన్న పనిచేయ ప్రయత్నించుట యికనైననూ మానుము. నీయందు గల దయచే యిదే నీ కట్లు విప్పుచున్నాను. రేపు మాపు నీవే వంటచేయుము ” అని కట్లను విప్పెను.

భగవంతుడ దేవిధముగ నదికిపోయి, స్నానముచేసి కృష్ణానదీ పావనోదకములు గొనివచ్చి పాకాదులు వేళకు నిర్వర్తించి, అత్తమామలకు భర్తకు పెట్టి తాను భుజించెను. ఇదే ప్రకారము భగవంతుడు ప్రతిదినము అత్తమామల యొక్కయు, భర్త యొక్కయు ఆజ్ఞలు నెరవేర్చుచు వారల కయిష్టమగు కార్యములు చేయక మెలంగుచుండుట కాంచి, శాంత, రాధ, సీత మొదలగు సక్కుబాయి స్నేహితురాండ్రు కృష్ణానది కేగు మార్గమున మన సక్కుబాయి అత్తమామల మాటచొప్పున నడచుకొను చుండుట, మన కందరకును సంతోష కారణము. అవును, వారలైనను ఇంత చిన్నతనముననే విష్ణుభక్తి వలననిరి గాని యితర విషయములలో బాగుగనే చూచుచుండిరి. సక్కుబాయి గుణవంతురాలు కనుకనే, తన భర్త ప్రేమకు పాత్రురాలైనది, అని చెప్పుకొనుచుండ మన అభినవ సక్కుబాయి విని లోలోన యానందించు చుండెను. పండరి పురమున సక్కుబాయి శ్రీ పాడురంగ విఠలుని నిర్వ్యాజమగు భక్తితో సేవించుచు, ఆత్మార్పణ మొనర్చి, ధన్యత చెంద నిశ్చయించుకొని ఒకనాడు స్వామి సన్నిధానమున కరములు జోడించి నిలువబడి, యేకాగ్రతతో దేవా! అనంతకోటి నమస్కారములు. మహానుభావా! నీ మాయనెరుంగ సామాన్యుల కలవిగాదు. పుండరీక వరదా! గజేంద్రునివలె నాకు మోక్షమిచ్చి కాపాడుము. భక్త వత్సలా! శబరిని రక్షించిన నీదయ నాపై జూపుము. కృపానిధీ! అక్రూరాది

భక్తుల బోధించిన నీ పీ దాసురాలిని నీయందు జేర్చుకొను మని ప్రాణములను విడిచెను.

ఈ విచిత్ర ఘటనమునకు భగవద్భక్తులు కడు చింతించిరి. స్వామి దేవాలయమున విధులను నెరవేర్చు పూజార్హులు దుఃఖించిరి. భజన పరులు యిట్టి విషాదవార్త కెంతయు పొగిలిరి. వేయేల? స్వామి దేవళమే కాంతిహీన మాయెను. ఎవరు విచారించి యేమిచేయ గలరు? అందు గల వారందరును సక్కుబాయి మృత కళేబరమును గొని పోయి శ్మశాన వాటికలో దహన మొనర్చిరి. సక్కుబాయిని యెరిగియుండినట్టి కరవరపుర బ్రాహ్మణుం డొకండీ యుత్సవమున కేతెంచి, విషయ మెరింగి పాప మాపె యత్త మామల కెరుక పర్చెదనని చెప్పి వెడలిపోయెను. సక్కుబాయి పండరిపురమున మరణించెను. కళేబరము కూడ దహన మొనర్చిరి. కరవరపురమున పాండురంగడు సక్కుబాయి యై కాపురము చేయుచుండెను. సక్కుబాయి కరవరపురము వెళ్ళిన గాని, స్వామి మరలి వచ్చుటకు వీలులేదు. ఇక్కడికే చాల దినంబులు విధిలేక భర్తను విడచియున్న రుక్మాబాయి కేమి చేయుటకును తోచలేదు. నాటిరేయి రుక్మాబాయి, సక్కుబాయిని దహన మొనర్చిన భక్తులకు కలలో సాక్షాత్కరించి "అయ్యలారా! నా భర్త కరవర పురమున సక్కుబాయి రూపముతో ఒక విప్రునింట యుండెను. ఇచట మరణించిన సక్కుబాయి వెడలిన గాని

ఆతడు వచ్చుటకు వీలులేదు. కనుక మీరు రేపు ఉదయము ననే సక్కుబాయిని దహనముచేసిన శ్మశానమున కేగి, ఆమె అస్థికలు పోగుచేసి నాకడకు తీసుకొనిరండు. నేను మరల నామె పునర్జీవితురాలుగ నొసర్చి కరవరపురము పంపవ లెను'' అనిచెప్పి యంతర్ధాన మొందెను.

ఈ కలకు భక్తులందరు మహాశ్చర్యమున మునింగిరి. పాండురంగడు కరవరపురమున నుండుటేలనో తెలియక వితర్కించిరి. కలల కర్థములేదని కొందరు శంకించిరి. అయిన నీ విచిత్ర మరయవలసినదే నని సక్కుబాయి యస్థికలు దెచ్చుటకు తుదకు నిశ్చయించిరి. అట్లే భక్తులందరు శ్మశానమున కేగి, సక్కుబాయి అస్థికలు యేరితెచ్చి శ్రీ రుక్మిణీదేవి పాదపద్మములుకడ నుంచిరి. జగన్మాతయగు నా రుక్మిణి నిజరూపమున సాక్షాత్కరించి సక్కుబాయి యస్థికలను స్పృశించినంతనే మహాభక్తురాలగు సక్కుబాయి నిదుర నుండి మేల్కాంచిన దానివలె, తనచుట్టును భక్తులు నిలువబడియుండుటయు, శ్రీరుక్మిణీమహాదేవి నిజరూపమున సాక్షాత్కరించి దర్శన మొసంగుచుండుటయు గాంచి, పూర్వగాథ నెరుంగని ప్రేక్షకుని వలె యించుక ఆలోచించి "జగన్మాతా! నీ దర్శనమువలన పూర్వకృతపాపములన్నియు నన్ను బాసినవి. అనేక వేల సంవత్సరములు నిష్ఠాగరిష్ఠులై, తపంబొనర్చు మహామునులకేనియు దక్కని నీదివ్యరూపము కన్నులారగాంచి ధన్యతనొందితిని. సర్వకాల సర్వావస్థల

యందును శ్రీకృష్ణునే తండ్రిగను, నిన్నే తల్లిగను, యీభక్తులనే సోదరులుగను, కలియుగ వైకుంఠమై కామితార్థము లిచ్చు నీ పండరిపురమే జన్మస్థానముగను నమ్మిన నన్ను రక్షించ వేరెవరున్నారు? తల్లీ! అశాశ్వతములగు నీయైహిక సుఖంబులు నేనుకోరను. అనిత్యంబగునట్టియు, ఋణానుబంధమైనట్టియు, పుత్ర మిత్ర క్షేత్ర విత్త ఆరామ గృహాదులతో తీరిపోవు సంసార లంపటమునబడి, దినమునకొక్క నిమేషమేని భగవచ్చింతన చేయని అమాయకులగు స్త్రీ పురుషాదుల యజ్ఞానముబాపి, సద్భక్తులుగా యొనర్ప వేడెదను. అసహనపరులు, అక్రమ మార్గానురక్తులు, అహంకారమదోన్మత్తులు, అజ్ఞాన దురంధరులు, అగు వారలనెల్ల శాంతపరులు, సుమార్గగాములు, పరోపకార పారీణులు, సత్యసంధులుగ నొనర్చి రక్షించుము" అని ప్రార్థించుచున్న సక్కుబాయిని శ్రీరుక్మిణీదేవి దగ్గరకు దీసుకొని "బిడ్డా! భాగవతశిరోమణివి కమ్మా. నీవు కోరినయట్లు నెరవేరుగాక. ఇక నీవు పయనమై వెంటనే మీగ్రామమగు కరవరపురమున కేగుము. నీభర్తయు, అత్తమామలును నీవలె వైష్ణవ భక్తులై మెలంగెదరుగాక. నీచరిత్ర సూర్యచంద్రాదులున్నంతవరకును, అన్ని భాషలలో ప్రబంధకములుగను, రూపకములుగను, యేర్పడి పఠింపబడునుగాక. అట్లు పఠించిన వారును, వినినవారును, అజ్ఞానాంధకారముపీడి, విష్ణుభక్తులై తరించెదరుగాక" యని యాశీర్వదించెను. అంత సక్కుబాయి రుక్మిణీదేవి పాదములు కనులకద్దుకొని, భగవద్భ

క్తులకు నమస్కరించి, నాటి సాయంకాలము కరవరపురము నకు ప్రయాణ మాయెను. పాండురంగడు కరవరపురమున సక్కుబాయి రూపమున నొక విప్రునింట యుండుట పండరిపుర మంతయు చెప్పుకొన జొచ్చిరి. ఈ విషయము సక్కుబాయి విని నదై, భగవంతుడు తనకొరకు యెన్ని కష్టములు పడు చుండెనో యని మిగుల విచారించుచు, నాడు కట్లువిప్పి పం డరిపురమున కేగి రమ్మని వచించుటకు శాంత రూపమున వచ్చియుండె కాబోలు నని వితర్కించుచు, వేవేగ కరవరపు రము చేరి స్వామి పాదములపై బడి క్షమించ వేడెదనని నిశ్చయించుకొనెను. అట్లాతురతతో భగవన్నామసంకీర్తనము చేసుకొనుచు యేతెంచు సక్కుబాయిని, కృష్ణానదికి ఉదకము నకై యేతెంచిన పాండురంగడు చూచి “తల్లీ! పాండు రంగని చక్కగ సేవించి వచ్చితివా? విఠలోత్సవము కనుల పం డువుగ గాంచితివా!” యని ప్రశ్నింపుచు నిజరూపమున సక్కుబాయి యెట్ట యెదుట సాక్షాత్కరించుట గాంచి, ఆమె కరములు మోడ్చి, “దేవా! క్షమింపుము. దీనదయాళూ! నీ కృపవలన పండరి మహోత్సవము తిలకించితిని.

బెంగాల్ తోడి — రూపకము.

ఎంత కష్టపడితివో? స్వామీ! యెంత కష్టపడితివో? స్వామీ!
అత్తమామ యాజ్ఞలెల్ల। కొత్తకాదెనీకు నల్లనిస్వామి ॥ఎంత॥
సారహీనమైన సం। సారవాంఛదీరె నోర। మీరకుండ భర్త
పల్కు। శ్రీరమేశ మెలగితివా! స్వామీ! ॥ఎంత॥
మారజనక నీదు సుకు। మారమైన మేనుస్రుక్కె। కూరిరు
రాల నాదుకతన। నేరమాయె క్షమియింపుమ స్వామి ॥ఎంత॥

అని పరిపరివిధముల సక్కుబాయి వేడుకొన పాండు రంగడు, మిగులదయతో "తల్లీ! నీ యొక్క నిర్మల భక్తి ప్రభావము వలన బంధితుడనై, నీకువూరుగా యిచట అత్తమామల యొక్కయు, భర్తయొక్కయు, ఆజ్ఞలు నెర వేర్చితిని. నా భక్తులకొరకై నేను పడు కష్టములు నా కానందము సమకూర్చును. నీవు భక్తిమార్గమును వీడక గృహస్థాశ్రమముననే నన్ను సేవించి తరింపగలవు. నీవల ననే, నీభర్తయు, అత్తమామలును సుజ్ఞానులై ముక్తిజెం దెదరు. ఎన్నియవాంతరములు వచ్చినను నన్ను మరువక సుఖం బుండుమ" ని యాశీర్వదించి, నీటికై తెచ్చిన కడవ నామె కిచ్చి యంతర్ధాన మొందెను.

సక్కుబాయి శ్రీపాండురంగ, శ్రీరుక్మాబాయిల దర్శ నముచే తనజన్మ సార్థకత నొందెనని తలంచుచు వారల కృప వలన తనవారలు వైష్ణవ భక్తులయ్యెదరుకదా యని యుప్పొంగుచు, కడవనిండ జలముగొని యింటికే తెంచెను. సక్కుబాయిని, భక్తులు దహనమొనర్చుట కన్నులార గాంచిన విప్రుడా విషాదవార్త యెరింగింప నప్పుడే సక్కు బాయి యింటికివచ్చి జరిగిన యావద్వృత్తాంతము వార లతో నెరింగించెను.

సక్కుబాయి అత్తమామలు, తొలుత నా బ్రాహ్మ ణుని నమ్మక కోపించినవారలై, సక్కుబాయిని జీరి "సక్కూ! ఈ విప్రుని వాక్యములు మాకర్థమగుట లేదు. నీవు పండరి పురమున కేగు టేమి? అచట నీతడు వచించిన యట్లు జరుగు టేమి? ఇందలి యదార్థము వచింపుమ" ని

యడుగ సక్కుబాయి శ్రీమహావిష్ణువే తన్ను పండరిపురము పంపెననియు, ఆతడే తనకు బదులు గృహకృత్యములొనర్చె ననియు, పండరిపురమున తాను మరణించిన విషయము యదార్థమేననియు, జగన్మాతయగు రుక్మాబాయి మరల బ్రతికించి, కరవర పురమునకు పంపెననియు సాకల్యముగా యెరింగించెను.

అంత వారలు మహాశ్చర్యమున, తమయింట యిన్ని దినంబులు శ్రీమహావిష్ణు చాకిరి చేసినది మందబుద్ధులమగు మనము గ్రహింపలేక పోయితిమనియు, ఆలక్ష్మీలోలుడు యెంతకటకటపడెనో యనియు, ఆపరమదయాళుండగు పాండు రంగడు తమతప్పులుమన్నించి రక్షించుగాక యనియు చింతించుచు, తమ కోడలి మహాత్మ్య మిట్టిదని యెరుంగక హింసించినందులకే నరక ప్రాప్తియున్నదోగదా యని విచారించుచు, తుదకు "సక్కుబాయీ! మేము నీమహిమ నెరుంగని అజ్ఞానులము, నిన్ను పరిపరి విధముల హింసించితిమి. మమ్ము క్షమించుము." అని వేడుకొనగా సక్కుబాయి "పూజ్యులగు నోయత్తమామలారా! మీరు నాక్షేమముకోరి, నన్ను మంచి మార్గంబున బెట్టుటకు ప్రయత్నించుట, దోషమెట్లగును. మీరునన్ను దండించుట చేతనేకదా శ్రీపాండురంగని కృపకు పాత్రులమైతిమి. ఆస్వామికృపచే మీరందరును వైష్ణవభక్తులైరి." అని వచించెను. అది మొదలు వారును వెనుకటి మాఢ్యమును వీడి, శ్రీపండరినాథునియందు పరమ భక్తిగల్గి యాతని యుత్సవము ప్రతివత్సరము దర్శించుచు, శ్రద్ధాభక్తితో స్వామిని సర్వదా ధ్యానించుచు, ఇహపర సౌఖ్యముల ననుభవించిరి. సంపూర్ణము.

వలయువారలకు :—

1. మినర్వాప్రెస్, మచిలీపట్నం.

2. యునైటెడ్ స్టోర్సు, మచిలీపట్నం.

3. తోట రామకృష్ణయ్య, బుక్ సెల్లర్,
శ్రీపండరీక్షేత్రము, మచిలీపట్నం.